# సూచి



మొగలుప్రభుత యంత్రితమగుట కేమి
చందురుని చల్వతోఁ దాజిచలువ నిలువఁ
గాలవాహిని తాజి మ్రింగఁగలనాఁడు
నిలుచు నీ తాజిప్రణయసందేశగీతి.



# తాజమహాలు

యమునానదీతీరకమనీయనీలక
ల్లోలాలు కంఠహారాలు గాఁగ
ఆపాతమనురమ్యకోకిలాంగనా
లాపాలు మేళతాళాలు గాఁగ
పవమానచాలితపాదపవ్రాతాలు
రంజించు వింజామరాలు గాఁగ
అహరహరానతమహనీయఫాలాలు
వ్రాలు మస్నిలఫాలాలు గాఁగ

అమరరసమయులలితకళాలయమున
నులులు కుంచెలు కలములు నోఁగింప
నిండుకొలువుండు శిల్పరాజ్ఞీమతల్లి
భరతఖండమునకు నెల్ల పాలనెల్లి.

నునులేవెన్నెలమోసులంగెలుచుచెన్నెల్ చిందుజాబిల్లి, ప్రా
క్తనపుణ్యైకఫలమ్ముగాఁ దివిరి యాగ్రాకాంత రూపించి ది
ద్దిన కావ్యమ్ము, నిజామలాద్భుతశిలాదివ్యాత్మకళా నైపుణీ
వినమద్దక్షిణపశ్చిమోత్తరకళాబృందమ్ము, ముంతాజ్మహల్.

నునుపుల్ దేఱెడు పాలరా నిగనిగల్ నున్ననన్న రాకూరుపుం
బని తెన్నుల్ నగిషీచమక్కులు నవోపాయంపు గ్రొన్నెరుపుం
దనముల్ నెమ్మనముల్ హరించుపలువిన్నాణమ్ములున్ భావమం
దనముల్ సల్పెడిసన్ని వేశములు వీణల్ సూన్చుమాధుర్యముల్

రూపు గొనియున్న కరువా? తీసుపులు గన్న
గండసువా? షాజహాన్ ప్రేమ కరఁగిపోసి
భద్రపఱచిన రజతంపు బరణి యేమొ?
మహికి డిగ్గిన యా చంద్రమండలమ్మొ?

పూవుం దేనియ తేటయూట, సుసవుల్ సొంగారు పాలేరు, మే
ల్మావుల్ పిండురసమ్ము ముంపు, చెఱకుం బాకమ్ము లేఁగాపు, పెం
గ్రోవుల్ గట్టిన గోస్తనీరసము, నిగ్గుల్ తేర్చి యీ తాజిలో
దేవీప్రేమపుఁ దివ్యతీపులనుఁ జిందింపంగనౌ షాజహాన్.

శిల్పరూపకావ్యకల్పనమో లేక
కావ్యరూపశిల్పకల్పనమ్మొ
అంకితమ్ము గొనియె నామహారాజ్ఞి తాఁ
బ్రతిఫలమ్ము గొనని భర్తచేత.

భర్త కావ్యకర్త పత్నియె కృతిభర్త
శిల్పమన్న కావ్యకల్పనమ్ము
ఇలయె స్వర్గమయ్యె నింద్రలోకము డిగ్గె
తాజి సౌధమ నెల్ల తాలుమాఱ !

షాజహాన్ తీక్ష్ణవిచారభావోద్వేగ
పరిణామ మీ తాజిభావ మంది
షాజహాన్ నయనప్రసారితదుఃఖవా
రిధి తాజిగాఁగ ఘనీభవించి
షాజహాన్ హృదయసంచలితకాంతాదిన్య
రుక్సమూహము తాజిరూపు చెందిది
షాజహాన్ మానసస్వచ్ఛప్రణయమార్గ
తరళత్వములు తాజిమెఱుఁగు పొంది

కరఁగి శోకమె మూర్తిఁగాఁ గట్టఁ బోలు
భావ బాష్ప హృదంతర ప్రణయములును
శాశ్వతత్వము గనియెఁ దాజ్మహాలులోన
షాజహాన్ శాశ్వతము, భార్య శాశ్వతమ్మె.

ప్రతిశిలాశకలదీవ్యద్గాఢఘర్మ్యానఁ
బ్రణయిని మెయితళ్కుఁ గనియె నేమొ ?
ప్రతిశిల్పిహస్తనూత్నవమ్ములో సంగనా
కరకంజమకరంద మరసె నేమొ ?
ప్రతిమందిరాంతరోపరిభాగముల సతీ
హృదయప్రసన్నత నెఱిఁగె నేమొ ?
ప్రతిసన్నివేశనిర్మితరేఖలో ముము
తాజిరూపమె తోఁచి తనిసె నేమొ ?

ఏమహావేశ మతని ముంచెత్తి తాజ
మహలుమూర్తిని నీధరామండలమున
కెత్తి యారతి యెత్తెనో యెఱుఁగనగునె ?
అతనిమానస మొక్క హిమాలయమ్మె.

సతులఁ గానమొ ? ముముతాజి సాటి రాజ్ఞిఁ
గనమొ ? భర్తలులేరొ ? మొగల్ ప్రభూత్త
ములును గల్గరొ ? సతులు ముస్మూచ పోరొ ?
ఏది యేతాదృశప్రణయైకముద్ర ?

ఏమి యాప్రేమరసనిమ్నగామహత్త !
ఏమి యా మిథునాత్మసంధానమహత్త !
ఏమి యా భావరమణీయతామహస్సు !
ఎంతమధురమొ తత్కళావృతమనస్సు !



# జ్యోత్స్న

షాజహాను చక్రవర్తికి దారా పెద్దకొడుకు, ఔరంగజేబు చిన్నకొడుకు జహనార పెద్దకూఁతురు, రోషనార చిన్నకూఁతురు. ఆగ్రాకోటలో రోగగ్రస్తుఁడైయున్న తండ్రిని గనిపెట్టుకొని జహనార యుండెను. ఔరంగజేబాగ్రాపై దండెత్తి రానుండెను.

అది వేసవి కలకల మ
న్నది వెన్నెల యని తెలతెల్లనైనది చపలుగా
మృదుమసృణప్రసవమ్ములు
విద్రిచి విద్రిచె తేకుకోనల విచ్చలవిడిగా.

ఒకవైపు గల తీరము నొరసి తాజ్
మఱొకవైపుఁ గల తీరము బొరసి పురము
దివ్యయమునాధుని నిత్యతీర్థమాడి
తాజి యాగ్రాను నాగ్రాయుఁ దాఁకఁ బాఱె.

పురమునఁ గల రాణివాసమందిరము నెలిసి
లలితలవలీలతాకుంజములకు దరిసి
శశిశిలామయవేదికాసనము పయిని
ఉజ్జ్వలజ్యోత్స్న జహానార యొరగసాగి.

కందుందీఱిన చందురుం దెగడు రేకల్ చిల్కు మైవెల్గుతో
నందంబై తెలికల్వ రేకులకు విందై విచ్చు కందోయితో
స్పందంబందు గులాబిపూవుగవ నైపైఁదోఁచు చెక్కిళ్లతో
నందీయందని భావవేగమున నుయ్యాలూఁగు డెందమ్ముతో

తాజిఁజూచును,గన్నుమోడ్చు,మరలందాజిన్ విలోకించు,లే
జాజుల్కున్నఁగొలంకులందొరఁగి విచ్చంబోలునోయేమొ! ఘూ
గాజుంబుగ్గల వెచ్చవెచ్చనగుచుం గన్నీరు జాఱున్ మదిన్
యోజించున్ దరిఁజేరినిల్చి చెలులై యోదార్చు లేవెన్నెలల్.

చెలులన్నం జెలులా? నిజార్జితయశశ్శ్రీ కించుమించైన నె
ల్గులు క్రొత్తావులు మంచుసోనలును శాలున్ మీఁగడల్ వాలా
కలికిం జూచిరి నిల్వునీరయిరి రాకాపూర్ణ చంద్రాస్యలా
చలువల్ చేతులుసాచి వే తొలఁచిరుచ్చైశ్శోకవాఃపూరముల్

తాజిఁ గనుగొని తల్లి ముంతాజిఁ దలఁచి
రుద్ధకంఠము జహానార రుతికిఁ దెచ్చి
కదలికదలని పెదవుల మెదలుపుకొని
పఱచిపఱవని హృత్సరస్వతిఁ గదల్చె.

"మిసమిసలాడి క్రొంబసిడిమేల్మి వెలార్చెడు నీదుమేను, ను
ల్లసముఁ బ్రసాదమున్ నిఱియ లాఁతగునీ తెలిచూపు కంఠనా వల్
ముసిముసినవ్వులన్ ముసుఁగుమూఁగెడి నీపెదవుల్, ప్రవర్ధయా
ప్రసవరసప్రసారమయి రాగిలు నీదు మనస్సరోజమున్

మాయవునామనస్సున,హిమమ్మురసమ్మునకిక్క తల్లి ! యా
ప్యాయితమైన త్వన్మృదురసాత్మ, తలంచినయంత నాకు భ
ద్రాయితమూర్తి వయ్యెదు, ధరారమకై తొలినాటిసూనముల్
మాయఁగఁజేయు నీ నలుకుమారులకుం బొడసూపనేరవో ?

పాపము చూడలేక యిలపై నిలుపోపవ, వృద్ధు తండ్రి కే
పాపము వచ్చి కట్టికుడుపం దలపెట్టెనొ? ఎట్టి పుత్రసం
తాపపుఁ గుమ్ములోఁ గుమిలి తాను గతింపఁగ నిల్చినాడొ? మై
యోపని యేవిపత్తులు నియుక్తములో యిఁక? మాతృదేవతా!

శాంతమూర్తికి దారాకు శాంతిలేద !
ధర్మమూర్తికిఁ దండ్రి కేదారిలేద !
నీవ యిపు డున్న సుతుల నే త్రోవఁ బెట్టు
కొనెదొ? పతికెట్టి యూరట గూర్చుకొనెనొ ?

తేఁకువ యొత్తిగిల్లెను, గతించెను నిల్కడ, తేఱుకోని యీ
నాకు మనోవ్యథాభరమునన్ మతి దప్పెను, దారి గాన, దు
ర్ధీకులు నీసుతుల్ కలఁక తేఱరు, భర్తకుఁ బాడుచావు రా
నీకు, చిరత్నరత్నఖని నిల్పెను తాజి, ఋణమ్ము దీర్పవా ?

ఏశతఘ్నులమ్రోఁత లెగయ నిద్దుర లేచి
వచ్చునో యెల్లి ప్రభాతరమణి !
ఏరమ్యరాజప్రభారేఖ వెలవెల
పఱచునో యెల్లి ప్రభాతరమణి !
ఏనెత్తురేటిలో నీదీది పెన్ జాజు
వాఱునో యెల్లి ప్రభాతరమణి !
ఏయినుం బూర్వాది క్కెక్కించి యుదయమ్ము
పఱపునో యెల్లి ప్రభాతరమణి !

ఏ దురంతసంతాపవాహినుల మమ్ము
ముంచనున్నదో తెలవాఱుముద్దరాలు !
మృగపతిని జంప బాణము నెక్కునెట్టి
కడలఁ బొంచిన గజవేటకత్తె యోలె?"

అనుకొంచున్ నెలరాలతిన్న మెయి నొయ్యం జేర్చి కన్నాసినం
త, నదోలీలఁగఁదోఁచె మల్లెపువ్వు వానల్ పంచుకొ ని వ్వెన్నెలల్
మొనయన్ వెల్లువతీర్చినట్టుఁగు రూపుం జిందు పూఁబోణి, తీ
సిన పేరచ్చపు వెన్న పూసయయితోఁచెన్ రానురాన్ రానురాన్

''అమ్మా! వెన్నెల చెల్మి కత్తెవు, వెలుం గాసించి నన్బిల్చి నీ
విమ్మై కుమ్మెలువోయి యుమ్మగిలుదే? యే నోపలేనమ్మ రా
రమ్మా కౌగిలినిమ్మ యమ్మ! జహానారా! నాకు మా తేడ్తువా!
కుమ్మిమ్మా క్రుమ్మని ప్రాణగొడ్డములతో ఘోషించు రారాజు కై.

ఎంత బ్రదుకును బ్రదికిన నేమిఫలము?
ఎంతలేసి కృతుల్ సేసి యేమిఫలము?
ఎంత విజ్ఞానఖని యయి యేమిఫలము?
తలఁగునే యెంతవాఁడైన దైవబలము?

తల్లీ! తమ్ములఁ గూర్చ నేరవు, ప్రభున్ దాటించు, మారంగు చేఁ
జెల్లంబోదురు తక్కుసోదరులు గాసింబొంది, తప్పింతువే?
తల్లీ! ''యంచును దాజిదిక్కుచనియంతర్ధానముం జేయఁ, గం
పిల్లన్ మేల్కని చూచి పుల్కుమని తన్వీరత్న ముద్విగ్న మై.



ఆహావాగ్నిచలచ్ఛిఖాగ్రసూచకనటత్
　　　భ్రమితకేతనపటాగ్రముల తోడ
భుసభుసారవకరస్ఫురితమత్తగజేంద్ర
　　　లయకాలవారిదచయము తోడ
తరతమస్వరనిరంతరఖురోద్ధూతధూ
　　　ళీలోలసైంధవాశ్వాలి తోడ
ఆశాంగనాదృగంతాంధచ్ఛటాకర
　　　ఝుళితాసిముఖభటావళుల తోడ

తళుకు పచ్చల వెలుఁగుల పులుగు టంచు
జిలుగు నెల తెలిగొడుగు నీడల వసించి
ఒఱపుఁ గెంపుల కనుల నెత్తురులు చిలుకు
తమ్ము నారంగు నల్లంత దవులఁ బోల్చె.







# బిందువు

ఔరంగజేబు ఆగ్రాకోట ముట్టడించెను. కోట చెక్కుచెదరఁ జేయ లేక ఔరంగజేబు యమునాతరంగిణి నుండి కోటలోని కున్న నీటిగొట్టము పగులఁగొట్టించెను. జహానార తమ్మునిఁ డౌరంగునొద్దకు రాయబార మరిగెను.

చుంగుల్ వాలిన తెల్లదుప్పటపురోచుల్ చిమ్ము డేరాల నౌ
రంగాభంగ భటాంగహస్తఝళితప్రారబ్ధఖడ్గాంశువుల్
పొంగుల్ పొంగులుగాఁగ దిక్కులొరసెం బోసంద్రపున్నుర్వులై
నింగిం జీల్చు జయార్భటిప్రకరనిర్ణిద్రప్రఘోషమ్ములన్.

తొలిశరత్తున నిండునెలరేయి నింగిపైఁ
దెలిమబ్బుఁతును కట్టై మలసినట్లు
చిఱువెండిగిన్నెలోఁ జిక్కనౌ నులివెచ్చ
పాలఁ దరకకట్టి ప్రాఁకినట్లు
తెలిమంచుకొండపై నొలసి ప్రాఁకాడుచు
మిన్నేరు పుడమికి మెఱసినట్లు
పాలమున్నీరు వెల్వడివచ్చి యలలపై
నమృతభాండము తేలియాడినట్లు



శిబిక డిగి రాణివాసంపుసీమ నంతి
పురపు మొగసాలఁ దెలిమేలి ముసుఁగు ద్రోసి
యడుగు మోపెను మొగలుల యాఁడుబిడ్డ
చిన్నతమ్ముని యొక దరిసెనము గోరి.

గాయపడ్డ మురాదు కనుచెమరించి స
లాముకై చేయెత్తలేమిఁ గుముల
చేతిలోని మురాదుశిరము నొయ్యన డించి
యరుగఁబోయి యరంగుఁ డాఁగిపోవ
కలకలలాడు మోముతో వచ్చిన రోష
నార కౌఁగిటనొత్తి చేరినడువ
కస్తూరికాగురుఘనసారగంధముల్
నాగవల్లీదళాల్ సాగి రాఁగఁ

జంటవింజామరలు పట్టి చాన లేఁగ
రత్నమయపీఠి చెలులు తేరంగఁ దోనె
యాసనము గొంచు నావేశ మణఁచుకొంచుఁ
బలికె జహనార యపురంగుఁ బలుకరించి.



రమ్మురా యన్న తండ్రిదర్శనము గొనక
తమ్ముడా ! గతమెల్ల పోనిమ్ము పొంది
నిలువుడా యన్న నాపల్కు విలువగొనక
దాడినచ్చితి శతవృద్ధు తండ్రిఁ జెనక.

సాగించెఁ దతచతుస్సాగరమేఖలా
        లంకృతభూరమాలాలనమ్ము
ఒడఁగూర్చె లలితకళోపాసకానంద
        మారందనిష్యందమహితవనము
కనిపెంచె నీయంతగా నుపజ్ఞాపార
        గాపారమేధావులైన సుతుల
నిలిపెఁ ద్వజ్జననీమణీప్రేమసురధునీ
        కమనీయసేతుబంధమును దాఁజి

చూపోకటఁ గోటి విలుచుకోనోపునతఁడు
అడుగుమడుగొత్తు సేవల నందు నతఁడు
రవ్వ నవ్వి వరాలెన్నొ రువ్వు నతఁడు
వేసివేయక బ్రదికిన వేలు పతఁడు.

పదతలమ్మునఁ జతురబ్ధు లొదిగిరాఁగ
శిరము నిరతము యమునాభిషేక మొంద
నోటి తడికేని లేదాయె నీటిచుక్క—
మఱి యరంగునిఁ గన్న సమ్రాట్టునకును.

బలమున్న విపులవిశ్వంభరాపీఠజి
గీషామనీషఁ గా ల్గీటవచ్చు
అలవున్నఁ జతురుపాయవికల్పములు సల్ప
వచ్చు సంగరము గెల్వంగవచ్చు
చవియున్న సమరాంగసాహిత్యములు నేర్వ
వచ్చు సాపత్న్య మోర్వంగవచ్చు
చలమున్న దశదిశాసామంతనృపరాజి
నేకసమ్రాట్టుగా నేలవచ్చు

కాని తండ్రికి నీటిచుక్కలను నాఁప
బలము నలవును జవియును జలముఁ జూప
వచ్చితే యిసలామ్మతపాలనాస్థ
పూని వెలసిన యోముసల్మానుబిడ్డ!

తండ్రియంతటివాని దారాను నులిచేసి
దెసమూలు పక్షిగా విసరినావ?
ముంతాజి పాల్గా్రివి ముం దాజి నుడికింపఁ
బితరుజొమ్మునఁ ద్రంపి వెట్టినావ?
త్వజ్జన్మదాత తా దప్పిదప్పియనంగ
యమునాసరిన్మార్గ మాపినావ?
రాజ్యకాంక్షకుఁ బ్రేమరాజ్యమ్ము బలివెట్టి
తడిలేనిగుండియ దాల్చినావ?

తొంటి మొగలాయిపాదుషాల్ వెంటఁ గొనిరె
రత్నమాణిక్యఖచితచిరత్నపీఠి
ఆచితాత్మమహీముద్రితార్థపేటి?
కీర్తి యపకీర్తి చను ననువర్తినులుగ.

తెలివికొలఁదులు తెచ్చు శ్రీ కెలసిపోకు
మిహ మశాశ్వత మాభోగ మిందె యాఁగు
దైవభక్తియు మానవాదరణసక్తి
శాశ్వతైశ్వర్యభోగపోషకము లోయి!



తననిండుకడుపుశుక్తిని వెల్వడినయట్టి
పుట్టుముత్తెమ్ముల పోషణింపు
తనగర్భవాసంపుగనిం బుట్టి సానలం
దీఱు రవ్వలు తీర్చిదిద్దు చవికె
తనకుక్షి తేనెపట్టుననుండి జాల్వారు
తియ్యపొంగులం బొఱుతెంచు సేఱు
తనకాన్పుతీంగ యందముచెంద విరబోసి
వికసించు చిఱుమల్లెవిరులచాలు

తనకుమారీకుమారసంతాన మనుచుం
బొంది పొరపొచ్చెములులేక పొసంగుననుచుం
బొరయుతావుల యశ మారంబోయుననుచుం
దలంపులల్లెను తొల్లి ముంతాజితల్లి.

అమ్మయాత్మ తాజిముఖమ్మునందు నిలిచి
కనుల నీరమ్మునించుం, దాంగన్న తలంపు
లాస లడుగంటి పతికయి యడలి కొంత
కన్నకానుపు నీతీరు గాంచి కొంత.



చేయింజాపని చక్రవర్తి చెయిచాఁచెన్, మంచపున్ రోగి, వృద్ధోయీ, తండ్రి గదోయి, యాతనిని జూడొక్కింత నంతఃపురిం బాయంబోనిమొగల్ గృహంపుఁబడుచన్ ప్రాధీననంజూడు, పానీయంబొక్కఁడెచాల్ సిరుల్ వలదు,తండ్రింజంపు దేతమ్ముఁడా!

అని మో మింతయి కెంపువాఱి చిఱుచెమ్మారంగ, నత్తన్వి కందొనలంగారిన యంబువుల్ నిలిపెఁ గందోయిన్, నిరస్త్రాలు గాక నెగోర్వెచ్చలుగాఁగళాపెళ్ఁగ్రాఁగంజొచ్చెలోన్,ధీర చయ్యనసూఁగాడుమనమ్ముతోఁడఁబితృదీనావస్థనూహించుచున్.

దీర్ఘరోగాహిసందష్టదేహుఁ డతఁడు
ఒగి జరాభారమున నేల కొరఁగు నతఁడు
గొణుఁగుగొంతున నీరెల్లు గొన్నవాఁడొ !
నాల్క తడియాఱి పిడుచగొన్నదియొ యేమొ ?

పనివిందుంగదయంచునామెయనుజుంబ్రశ్నించుచూపొక్కడూనిన నౌరంగుఁడు నిండుకుండయయి తొణ్కలేనిదృష్టిం బ్రకంపనముల్ నీలమణిప్రభానిచుళితప్రాలంబితశ్మశ్రువుల్ మునుకొంచుం గొనదన్కఁగీఱివిడిచెం బ్రోద్యన్నఖాగ్రమ్ములన్.

చూచుచున్నకన్నె చూచుచునేయుండె
వాయుపూరమైన వానిమూర్తి
అన్నదమ్ములందు నక్కసెల్లెండ్రందు
వాకులేక గాలిపోక యూఁగె.

అవురంగభటచిరాభ్యస్తవప్రపముఖాగ్ర
చాంక్రమణక్రియాచణతఁ గాదు
అవురంగచటులాశ్వికాసికవోష్ణధా
రాచ్ఛటావలయవారమునఁ గాదు
అవురంగకుంభికుంభాస్రవత్స్వచ్ఛ
దానమోదమదజలవ్యాప్తిఁ గాదు
అవురంగవిరచితాయఃపిండకృతచల
ద్భ్రమితాగ్నిశకలశతఘ్నిఁ గాదు

దారి యిచ్చిన దుక్కపోఁతగల కోట
యామునాంభఃకణమ్ము కన్యైన జేని
గర్భమున దాఁచలేక దుర్గమ్ము తుదకుఁ
జెక్కుచెదరకె యవురంగుచేతఁ జిక్కె.



# జీవతంత్రి

ఔరంగజేబాగ్రాకోట వశముచేసికొని చౌరబాటి తండ్రిని జెఱసాలలో నునిచెను. లలితకళోపాసకుడగు షాజహాను తనఫిడేలుకుఁ దీఁగ దెగిన దనియు నొకక్రొత్తతీఁగ నిప్పింపుమనియు ఔరంగజేబునకు ప్రార్థన మంపెను.

బహువిధయుక్తిసువ్యంజితధాతువుల్
ప్రకృతిగానములోనఁ బలుకవేమొ?
తారకమధ్యమందరసువ్యవస్థితి
ప్రకృతిగానము పట్టుపఱపదేమొ?
ద్రుతమధ్యలంబితాదులు పట్టి తాళముల్
ప్రకృతిగానములోనఁ బడవొ యేమొ?
అతులగోపుచ్ఛాదియతులు మూఁడును సాఁగి
ప్రకృతిగానమునందుఁ బ్రాఁకవేమొ?

తత్త్వమోఘానుగతవాద్యతత్త్వవిధులు
ప్రకృతిగానములో సరిపడవొ యేమొ?
ప్రకృతిరమణీసుధర్మాంకపాళిలోని
దివ్యవీణకు నొక తంత్రి తెగెనొ యేమొ?

గళితాశాప్రవిషణ్ణా
కులచిత్తము బంధనాగ్నిఁ గుములఁగ బహుగై
లలితకళాస్థానమహా
త్కాలపూర్వచరిత్రుఁ డొకప్రకారము తోఁచెన్.

భరతఖండేంద్రపదమును బట్టివిడిచి
పుష్కలైశ్వర్యములు త్రావి పుక్కిలించి
యుమిసిన విరాగి రాగమ్ము తమి లపించి
భావమున నించెఁ బతితపావనపదమ్ము.

తేనెల్ సోనలుసోనలై కురిసెనో! తేటైన ద్రాక్షాసవం
బాసితంబయి వాఁకలై మలఁగెనో! యాదివ్యగాంధర్వగీ
తీనాదమ్ములు క్రొవ్వులై విరిసెనో! తీపారు తత్కిన్నరీ
వీణానాదము మూర్తమయ్యెనో! యనం బెందీపులూరించుచున్

అల తొలినాళ్ల నాషహాజహాన్ లపియించు నిశాంతగీతికం
గిలకిలలాడియాడి తమకించి నటించిన యామునాపగా
శిలలపై యాదృశంబుగఁ గృశించి ద్రవించి స్రవించి కాకలీ
కలకలనాదరోదనము గల్పెడి నేఁటివిషాదగీతికన్.

పలుతొలియేండ్ల నెయ్యముల పాఁతు లగల్చి పెకల్చి తియ్యతీ
పుల పతిపాటలన్ మునుపు పొంగిన యాప్రియురాలు తాజి యా
విలగతి భగ్నగీతివిని వెల్వెలఁబోవుచు నేఁడు దుఃఖవా
ర్మలినముఖాబ్జయై యెడఁద అంపపుఁగోతకునిచ్చి కుయ్యిడున్.

కుహుకుహూహుహూకుహుగానసంగతులువాఁగుల్వాఁజుఁబూర్వమ్ము త
త్సహకారాగ్రకిసాలయాశనము పెల్చం గ్రోల్చి రెట్టించెఁ బ్ర
త్యహమున్ భూపసుధాశనాలపితదివ్యద్గీతికామాధురిన్
రహిం, నేఁడో! కొసరంగఁబోవదది ప్రారబ్ధమ్మునన్నాడుటన్.

మొదలిసఁజాలుఁ దత్కథను మేకొని తండ్రికిఁ జేర్చు నమ్మహ
మ్మదుసులతాన్ బితామహుని మైమయినిల్చి కనందొడంగె, న
మ్మదుసలి వెల్గుపోవు కనుబొమ్మల నల్లననెత్తి కొల్లగాఁ
జెదరిన పెన్నెరల్ పొదువు చిక్కనిచూపులు చిమ్మి యిట్లనున్

"ఓయీ! ప్రభు వేమనె? నీ
వాయువిలీనమ్ముదీవ వ్రస్సెఁ గళాస్థా
నాయతనముసం దంత్రిక
నేమొక్కంజేని యీయ నే వేఁడితిఁగా!

త్రెస్సిన ప్రాణతంత్రి, తెగఁద్రెక్కొని నీరసమానెలుంగు, పైఁ
గ్రుస్సిన మేని త్రెవ్వన, యరుంతుదమైనవిరాగ, మెంతయున్
డస్సినయంతరంగమును, నావలెఁ దాల్చి కళావిహీనయై
యుస్సురుగాడుపుల్ చెఱగుచున్నది నాతుదిత్రోడు తానయై.

జీవనశేష మల్పము, విశీర్ణమదాత్మకు శాంతి సున్న, యీ
జీవనతంత్రి మేళనముసేయగఁజాలిన తంత్రి తెమ్మ, నా
జీవిక వెళ్ళఁబుచ్చ, నెదిసేయని సాంత్వన మద్దిసేయు, రా
రా! వచియింపురా! ప్రభువునానతిసెప్పుమురా! కుమారకా!”

అని దురపిల్లి యుమ్మగిలినట్టియెదం బొదువంగవచ్చు భా
వనివహమొయ్యనొయ్యనిలుపన్ నిలుపం బ్రయత్నించుషాజహా
నునిమనుమండు డగ్గరుచు నూల్కొని యాజ్ఞనొకండు చెప్ప కా
పినమతి బాహిరించి పెదవిం గదలించియు మిన్నకుండినన్

ముదుసలివగ్గు చూఘుములుమోసుల సూత్రముపట్టి ‘ఏమిరా!
యెదో వచియింపనోడెదు వచింపుమురా ! యరయేలరా మహా
మ్మదుసులతా?’నటంచుఁ దఱుమందఱుమం బొరవిచ్చిదూసి నె
మ్మదిగలరాజునాజ్ఞ నొకమై వచియించె నిటుల్ కలంగుచున్.

"రవలకిరీట మూనిన శిరమ్ము ధరాఘమహాసనమ్ము, భూ
ధనభుజభార మూడ్చగల దక్షుఁడు పుత్త్రుఁడొకండె, జ్ఞానవై
భవ మొసఁగంగదక్షుఁడు ప్రవక్తయొకండె, సుతుండు దూతమే
మవుట ఘటిల్లె, స్వార్థ మిఁక నందక డెందముకందువార్చె దే!

పాగిలెదవేల పూర్వసుఖపుంజములం దలపోసికొంచు? రా
జగునతఁ డట్టి యూడిపడి స్వామ్యములం గొనిరాఁడు, తోడనే
లగఁగొనిపోఁడు కూడినయిలాధనముల్ పదిలమ్ము సేసి న
చ్చిగనుప్రజార్తిఁబోనడచి చెందుఁగృతార్థతస్వార్థమొడ్డుచున్

అది యంతే! నెఱనెమ్మిగద్దె కథిపుం డౌనెవ్వఁ డవ్వానివే
గద! నీపేటికనిండ భూషలును ముక్తావిద్రుమశ్రేణియుఁ
తుది నీవూను నమాజుపేరులును దుస్తుల్ వాయులీనమ్ము నీ
మదిఁ కింపందగు సర్వచిత్రములు నిమ్మా!"యంచురాజాడెడిఁ.

అని మనుమఁడు రాజాజ్ఞను
వినుచునె తడవుఁగను రాజభృత్యుఁడు కార్యం
బును శిరసావహించఁగ
మునుకొని ముదిరాజుముందు పొన్పడి నిలిచెఁ.

విన్నాణముల వన్నె వన్నె చుక్కలజిల్గు
వల్వలన్నిటిఁ దీసి వామివేసి
విలువముత్తెముల పేసలతోడఁ బగడాల
రతనాలహారాలు రాశిపోసి
విరఁబూఁచు మల్లెపందిరియఁ దాచు మదికించు
లలితకళాలయమ్ములకుఁ దొలఁగి
నగిషీలయరల దంతపుబీరువాలలో
వెలుఁగుజాడలపొత్తములు త్యజించి

పుడమి విడిచియు విడువఁడు పూర్వసార్వ
భౌమపదవీముహుస్స్వప్నభగ్నహృదయుఁ
డతఁడు మిగిలెను దేహమాత్రావశేషి
యాఁజహానార యుడిగము లందుకొంటకు.

మనుమఁడు ఖిన్నముఖుండై
వెనువెన్కనె యొదిఁగి తాతబెందుదనమ్ముల్
గనుచున నిల్వఁ గళారా
ధనఖని చిత్తరులు చూచి తత్తఱపడుచున్.

"కుంచియకుచ్చు నుంగొనకుఁ గూటిన మేల్తరమైన యార్ద్రభా
వాంచలసంచయం, బలుపమా నొకరేఖకె వంగివచ్చి రో
మాంచముకూర్చి తేర్చెడి రసానుభవమ్మును, జిత్రలేఖనా
భ్యంచితదోహదాలు తడియాటిన నాయెదకుం గుమారకా !

ఇదిచూవే! మముతాజిచిత్ర,మిది నాకెన్నెన్నొఎలోఁద్రవ్విపై
నొదిగించెఁ సుచిరానుభూతు, లిట నేయొక్కండొ మజ్జీవికం
గదలించుఁ బ్రదికించు నన్నిటులఁ, దత్కల్యాణమూర్తిప్రభా
భ్యుదితానందమరందవీచికలలో నూగించు రాయంచగా."

అని యాచిత్రముకంటనద్దుకొనుచాయఁ బాష్పబిందుద్వయిం
దన ముంతాజికరాన రాల్చి నవరత్నాంబుప్రసారంబు చా
ల్పున దీపించు రసప్రవాహరుచిరంబుఁ వాయులీనంబు నొ
య్యన ముద్దాడి పురస్థలిన్నిలిపి రోమాంచమ్ముతో నిట్లనున్

"ఏతద్వాయువిలీనతానములె రేకెత్తించు నాలోఁ గళా
శ్రీతన్వీపదకంజమంజురవమంజీరోచ్చలద్ఘంటికా
వ్రాతోద్భూతఘులంఘులాఘులఘులప్రారంభసంరంభముఁ,
చేతఃప్రీతికరంబుఁ దాపహరముఁ నిశ్శ్రేయసాపాదముఁ.



అదిగో! మద్రాజ్యపాలన మంత దెచ్చె
ఇదిగో! మత్పుత్రసంతాన మింత యిచ్చె
మిగిలినది యెక్కఁడే! కళామృతకణాళి,
ఒడలు పిడిచిన నా తొలిగడనలందు.

ఇది పాయర్ మనసొప్పదు
తుదితో డిదిమైన నగుచుఁ దోషమునిడు నం
చెద నమ్మితి, నూరట యె
య్యదో చితికినగుండె"కనుచు నవియు నొసఁగుచుఁ.

పితలను దుర్గతిపఱచిన
సుతులకుఁ దమసుతులచేతి చోద్యప్రతిపా
దితప్రతిఫల మిదేకాదా!
అతిచిత్రము భగవదిచ్ఛ"యని కను మొగిచెఁ.





# ఏది?

షాజహాను తనగాథయంతయు వడపోసి చూచుకొని తన కిహపరము లలో మిగులునదేమని జహానారాను ప్రశ్నించిన ఘట్ట మిది.

చెఱసాలన్ రతనాలపూవుల జగాసింగారపున్ ద్వారమం
దొరపో కెంపుననొంటఁ దాఁజిఁగనుఁ జెయ్వ్యాల్ దక్కి కన్నీటిచా
ల్తొరగించున్ దొర, నిల్వనీరగుచు నిల్చున్ నిల్చినట్టే, నిరం
తరసంతప్తహృదంతరాళవిచలద్భావవ్యథాఖిన్నుఁడై.

కుమిలిన పేదజీవమునకుం దగుసేవలొనర్చి తేర్చుచున్
నిమురుచు మెల్లఁ జేఁజివురునిల్పి వపుస్సుఖమానయించుచున్
చెమరిచి చూపువెన్నెలలు చిమ్ముచు నాసయొకండ నించుచున్
తమి నుపవిష్టయైన జహానారకు నిట్లనె రాజు రోఁజుచున్.

“అమ్మా, మత్ప్రణయాధిదైవతము నాదౌ జీవితజ్యోతి మీ
యమ్మేయయ్యదియాఱిపోవఁగొడిరూపయ్యెన్ సుమాపీఁచుధూ
మమ్మున్ గ్రక్కుమసిన్ వెలార్చి నుసియై మాయంబగుందప్ప లా
భమ్మేమీ? యిఁకనైనఁ జావుజదొకో ప్రాయోపవేశమ్మునన్?

ననుమఱపింపఁదగ్గ కరుణామకరందవిశిష్టహృత్సరో
జుని మహనీయసద్గుణవిశోభితసుందరరూపునిఁ జగ
జ్జనహృదయాబ్జతోరణసుసంహితమానససూత్రునిఁ మఱీ
తనువును వెళ్ళమార్చునని నమ్మిన నాతొలుదొల్తిపట్టినిఁ.

దారా నిట దెసమాలిచి
పోరాయని, గుండెదీసిపుచ్చినబం టా
యౌరంగుని కత్తికి నెర
కారా యని పంపి మొండికట్టె బ్రదికితిఁ.

ఉండఁగ నూఁకలేక పడియుండఁ గుటీరములేక యుమ్మలం
బొండఁ వెలార్చుకోఁగఁ దనయుగ్మలిలేకయు 'దారుఖాను'నా
గుండెయు వెంటలేక వెడఁగుంబలె 'మల్లిక' చైతనానఁ బు
త్రుండట నెత్రుముద్దయయిత్రుంగెనె ? మ్రింగితినట్టె దుఃఖముఁ!

అతనితలను నఱకి యౌరంగునకుఁ జూప
నతనిమోము చూడ ననుచుఁ దన్నె
ననుజూఁడకట్టె! గుండెలవియక బ్రదికితి
నేమిచూచి యిందుఁ బ్రాముకొనఁగ.



అతని కడుపుపంట యా 'సులేమాన్ షుకు'
అతనివెనుకఁ దళితుహక్కు గలఁడు
బంటు వాఁడు, నాకు బ్రదుకుతీపియు వాఁడ
పిన్నతండ్రిచేతి విసము ద్రావె.

కన్నెల్ నూర్వ్యరనిచ్చి కల్లుకయిపుల్ కల్పించి మోసంపుఁగ
న్నన్నం జేతులుగాళ్లుగట్టి చెఱలోనం ద్రోయఁజేయించి పైఁ
బన్నెౕ నేర మొకండు, దాన సమయింపం బంపె నౌరంగుఁ డా
యన్నన్ వెఱ్ఱిమురాదు, నద్ది జహనారా! నన్నుగాసించెడిన్.

తమ్మునివలనిభీతిఁ దరలిన నా 'షుజా'
యడవిపట్ట భృత్యు నంపెఁ జంపఁ
గడుపు చీల్చుకొంటిఁ గట్టైనె నిలిచితి
నేమిచూచి యిందుఁ బ్రాముకొనఁగ.

నరుఁడు దేవుఁ డేఁచి నన్ను నా సర్వమ్ము
నాహరించునటవె? యట్టికృతుల
నెట్టినియతధర్మ మేలు? నుద్దిష్టార్థ
మెట్టి దీశ్వరునకుఁ గృతముపడిమె?"



అని పలికి వగర్చుచు జే౽
డనునయభావాంబుకణము లమరక హృదయం
బనుతప్తకవోష్ణముగా౽
గను కెంపుల సీరు గ్రుక్కి కటకట పడ౽గన్.

అడలువడియు జహానార పడనియటుల
మోము మోమునఁ జూపుఁ జూపునన నిలిపి
పలిత కేశపుఁ బట్టుకుచ్చుల ముఖమ్ము
నల్లఁ జేదమ్మి నిమురుచు మెల్ల ననియె.

"ఎవరికి సాధ్యమౌ౽ గడచువృత్తముదోషము నిర్ణయింప? మా
నవుదొసఁగెన్ను రాజు, జననాథునిదోసము కాలమెన్ను, మా
నవపతి దోషనిర్ణయముసం బెడదారినిఁబట్టవచ్చు, 'దో
షివి మఱి నీవ' యంచుఁ బతిసేఁతకు శిక్షవిధించుఁ గాలమే!

ధర్మముచేఁ బ్రపంచము యథాక్రమమై నిలుచుఁగా, నశించు నీ
ధర్మముచేతఁ దా నిలువదార్ఢ్యములేని జగత్తు, తత్కథా
మర్మమెయీ మొగల్ ప్రభుతమన్నికినిర్ణయముం బొనర్చుఁబో!
ధర్మరథం బధర్మహయదర్పముచే నడు సాగునే ?

ఈసామ్రాజ్యము క్రుంకునంచునిసుమంతేంజింతనొందం బితా!
యేసామ్రాజ్యము లిందునిల్చినవి? కానీ తత్త్వవక్త్రాత్మ వెల్
గాసింజెందుగదా యటంచు మదిమ్రగ్గంజొచ్చె, విశ్వైక్యసం
ధాసంధేశమహార్థముల్ గను నపార్థమ్ముల్ మతాలంబులన్.

మతము మనుజునిమనుగడ మనునదేని
మతపరమలక్ష్య మాత్మసంయమనమేని
మతమహత్త్వముఁ జెప్పఁ ద్వన్మతిమహాస్సు
నెలుఁగునికి వస్తువగపాట తెలుపుగాదె?

నెమిలిపించెపుగద్దె రాణించు నీవు
బండెచవి పొందవో తక్కుపతులఁ బోలె
నంధమృతిఁ బొందియుందు, పూర్ణానుభూతి
సర్వతోముఖమయి యుంద సంక్రమించె.

అనుఁగుపుత్రులకన్న నీ కమ్మగాఁడె
యాత్మబంధువు, కుమిలెద వతనిచెయిదిఁ
బాగులుగాక బంగరుపూస మూసఁ గరఁగి
కర్మమర్మ మా కమసాలికై వెలుంగు.

సతినిఁ బ్రేమించి లోఁ తెఱింగితివి, రాజ్య
సతినిఁ బ్రేమించి శిఖరాగ్రతతిని గంటి
సుతులఁ బ్రేమించి చవులెల్లఁ జూఱఁగొంటి
పండముగ్గిన యాత్మానుభవముఁ గొంటి.

సకలసోపానములు దాటి సత్యసౌధ
వాస మర్థించు త్వత్కళాపరిణతాత్మ
మత్కళాదర్శమూర్తిగ మలఁచుకొంటి
గురుపదోపాసకానందకోటి నంటి."

అనెడికూఁతుపలుకు లాలించి తనరూపె
తనకుఁ గ్రొత్తగాఁగఁ దాకుకొనుచు
తేఱుకొనుచుఁ దనయఁ దేఱిపాఱఁగఁజూచి
తెప్పలార్చి మొగలుఱేఁడు పలికె.

"ఎదో యదృశ్య తేజస్సు నామదిని జొనిపి
చొరఁగరానిమూలలు సొచ్చి చూచినావ?
కడకు డాఁగిన మద్వందిగణముపేరఁ
బ్రస్తుతులుకట్టి వల్లింప వచ్చినావ?

శిథిలశిథిలజీవితమునఁ జిదుకులేఱు
బహుగుబ్రదుకున నేవెల్గు పుడికినావు ?
ఆత్మపరిణతికేమి యాయవ్యయాలు
కట్టితేల్చుచు శేషింపఁగల దదేదో ?"

అనుచుఁ బృచ్ఛించు తండ్రిప్రశ్నాళి కొక్క
బాష్పదామమ్ము ఱెప్పవిప్పార్చి జార్చి
కన్నె తనకన్నె తాజివంకను నిగిడ్చి
తండ్రితడిచూపు తాజెఁ బ్రదక్షిణింప.



# కళ

షాజహానునకు నాసయుఁ దృప్తియు మొలకెత్తించుటకయి జహానార కళాప్రాశస్త్యము నుగ్గడించెను.

"మొగలుప్రభుత యంతర్హితమగునుగాక
చందురుని చల్వతోఁ దాజి చలువ నిలుచుఁ
గాలవాహిని తాజి క్రింగఁగలనాఁడు
నిలుచు నీతాజపరిణయసందేశగీతి.

తాజి భవత్ప్రియాప్రణయధర్మరహస్యమెగాదు సూవె! యు
త్తేజితమయ్యె సర్వజగతీప్రణయాధికృతిప్రభావ మీ
తాజిని, సృష్టిమూలమగు తత్త్వము రూపముపొంది నిల్చె నీ
తాజి వినిర్మితిం, గళకుఁదక్క లభించునె యీమహాత్త్వముల్?

కళ యొకసృష్టిసాధనము, కల్పన కిక్క-, యనల్పయోగ, మీ
యిల భగవత్ప్రసన్నతకు నిమ్మగుబాట, పురాతపస్సము
జ్జ్వలమగు సంస్కృతింగొన నుపాసన నౌనె కళాపిపాస? జీ
వులపెరయోగసాధనలు ప్రుంగుఁ గళామహిమమ్ము చెంగటన్

ప్రకృతిచైతన్య మెఱిఁగెడి ప్రకృతి జనని
జీవరాసులఁ బ్రత్యేకజీవిఁ జేసె
నరుని పక్వచైతన్యమునన్ జగత్తు
వడియఁగట్టినఁ బడురూపె కళ ధరిత్రి.

స్థిరతఁగొనియె సూక్ష్మతత్త్వగరిమ కళనె
ఆలపించె హైందవతత్త్వ మార్షకళనె
ప్రతిపురావాక్కు స్థిరతనుబడసెఁ గళనె
మహదుపజ్ఞలు కళఁబట్టి మహిమఁగొనియె.

కళ కనేకత నేకత కానుపించు
విభజనము విరుద్ధము కళావిభవమునకు
విడిచి యంగిని నంగ మొప్పిదముగనునె?
వాక్యమెడలిన పదము భావములుగనునె?

కళయె బోధవాహిక సృష్టికల్పనమున,
వస్తువది సృష్టి, సృష్టి యీశ్వరవిలాస,
మతనిసంకల్ప మాది, కర్తృతయె నీది,
హస్తకల్పజనాంతరుఁ డతఁడు కళకు.

సత్యసిద్ధికివలయు తద్జ్ఞతయగాక
శిక్షణమునిచ్చు గురుకులశ్రీ కళాంబ
తత్త్వమర్థించి చను కర్ణధారిచేతి
జలధియానప్రమాణసూచకము కళయె!

ధర్మములలోని యేకైకధర్మ మరయ
నియమములలోని యేకైకనియమ మరయఁ
గళయె దర్శకయంత్రపు వెలుఁగుకన్ను
చూపుపరకోటి ముట్టిన సూక్ష్మరేఖ.

కనఁబడెడుదానఁ గనరానికలిమి చూపి
తెలియఁబడుదానఁ దెలియనితెలివి తెలిపి
పలుకుగలదానఁ బలుకనియెలుఁగు గలిపి
పలుకు సత్కళ యొక్కక్రొత్తవెలుఁగుపలుకు.

ఆదిసృష్టికి మూలము సానుభూతి
అగుఁ గళాసృష్టికిని నాది సానుభూతి
ప్రేమ మెఱుఁగని చేతి కళామృగమ్ము
కళలరాజున కొక్క కళంకము నిజమ్ము.

సుందరాతిసుందరవస్తుశోధనమున
నింద్రియముల నియోగించియే కళార్థి
కోర్కులుడిగించు నాయొక్కకోర్కెఁ బెంచు
దివ్యసుందరమూర్తి సాధించుకొఱకు.

సహకారపల్లవాశనమత్తకోకిలా
పంచమస్వరరాగఫణితి వినియు
మందమందాయాతమలయమారుతపోత
మధురసౌరభబృందమహిమఁ గనియు
బాలేందుచంద్రికాపాలితకల్హార
కమనీయధాళధళ్యములు గనియు
సుచిరస్ఫురణయోగ్యరుచిరాన్నభోజన
రసరసానుభవపారమును గనియు

జ్ఞాననిష్ఠాగరిష్ఠమనస్సమాధి
'నేతి నేతి' యటంచు సన్నిహితమైన
యందమర్థించి యానంద మందియంది
తుష్టిగనఁ డీశ్వరపిపాసితుఁడు కళార్థి.

సృష్టిని నొక్కఁడై పొడమి సృష్టికె భీతిలి సత్యలబ్ధికై
సృష్టినిఁ జీల్చిచెండి కృశియించి తపించును శాస్త్రవాది, యీ
సృష్టినిగౌరవించి సకలేంద్రియమూల మతీంద్రియార్థమున్
సృష్టిపొనర్చి లోకము తరింపఁ దరించుఁ గళార్థి ద్రష్టయై.

నీవు తరింపఁదగ్గ కృతినిన్ రచియించుటె కాదు, లోకము
జీవముఁ జేయు తత్కృతి సృజించితి, సృష్టికి వస్తువెందునేన్
జీవమె? త్వన్మహాకృతికి జీవము శిల్పుల కిడ్డ బంగరుం
బ్రోవాకో? చల్వరాతి తెలుపో? నునుపో? మఱిరూపొ తెల్పుమా!

సృష్టిజీవము ప్రణయప్రవృత్తి, కృతికి
నైన జీవము ప్రతిపాదితార్థవృత్తి
సృష్టినిలుకడ కృతినేతృధృతిని గలుగు
సృష్టి నిలుకడ కర్తృసంస్కృతిని గలుగు.

జాతరూపదోషము మ్రింగు జాతవేదు
నటు కళ యుపాసకుని దోస మాహరించు
త్వత్కళాసంస్కృతిమహాగ్ని పదడుసలిపె
నలుపములు తొంటి నీదోసములను వేల్చి.

సృష్టిఁ బ్రాతినిధ్యమ్ము నిచ్చించి నీవు
రక్తభాగమ్ము పంచి పుత్రకుల కిడితి
నీదువ్యక్తిత్వ మందున నిలిచెనోటు ?
తాజిలో నిల్చెఁ బ్రాతినిధ్యమ్ము నీకు

కన్నబిడ్డ యొక్కనిబిడ్డ గాదుగాదె ?
సగము సకియది, మిగిలిన సగమె తనది
కళ స్వకీయ, లింగాతీతవిలసితాత్మ
కానఁ బావిత్ర్యమున బిడ్డకన్న మిన్న.

ఉడుగరల్ గొనివచ్చి యుడిగమ్ము లొనరించు
ఛేండ్లఁ జూపునఁ బల్కరించు ప్రభువు
కన్నతండ్రిని గడగండ్లపా లొనరించి
యుసురుగొన్నట్టి కర్కశసుతుండు
నలుసంద్రముల మేరగల యిలాతల మొక్క
గొడుగునీడకుఁబట్టు పుడమిఱేఁడు
పలునిరాశలు ప్రోగుపఱచి కో యన్న నా
యన్న దిక్కన్న లేకున్న మ్రోడు

షాజహానని పిల్వ దీజగము రేపు
రసికమానసవాస మేర్పఱచుకొన్న
ప్రణయగానమహోజ్జ్వలపరిణతాత్ముఁ
డనియె యెల్గెత్తి పల్కరించును మహాత్మ!

ధన్యజీవి వీవు, ధన్యాత్ముఁడవు, నీకు
నాయమొండెగాని వ్యయము లేదు
వెలుఁగెకాదు జగమువెలిఁగించు విద్యుత్ప్ర
సారకేంద్ర యంత్రశాల వీవు.

అమరతఁగొంటి, తాజియె సురాలయ, మీవిట స్వస్తిచెప్పి దే
హము బరువుం ద్యజించి యడు గందునఁ బెట్టఁగనే నివాళిప
ళ్లెముగొని పూలజల్లు తరలించుచువచ్చును తల్లి యెల్లి, తత్
సుమతరులిచ్చు నీడలను జొక్కదు మజ్జనయిత్రి తోడుతన్''

అని జహానార, జ్యోత్స్నకవిహాయసచుంబిలుఠత్తరంగమో
హనమహితాంబురాశి నురుగారెడిరీతిని బొంగిపొర్లి తూఁ
గిన యెదముంపు తేల, స్ఫటికీకృతకాంతిమహత్త్వ మట్టిచూ
చినపరితృప్తిఁజూడ్కి కవఁజిందుచుఁదండ్రినిఁదాజిఁగాంచుచున్

చంచదఖండపక్ష్మలవిశాలమృగీనయనాంతహర్షవా
స్సంచయసిక్తగండ యయి, చక్కనిపుల్కల లేఁజిగుళ్ల మ
న్నించినమేనుతీవ కొకనృత్యవిశేషము నేర్పి, కైకవం
బెంచినచప్పటుల్ లయకుఁ బెంపిడఁదీయనిదృశ్యమిచ్చెనన్.

జల జల రాలెఁ దాఁజిపయి చల్లనివెన్నెల బొడ్డుమల్లెచాల్,
మిలమిలలాడి రిక్కలు తమిం జిఱునవ్వులు రువ్వె, నీలమా
లల యమునాతరంగిణి చలన్మణిదీపికలెత్తెఁ, గోటలో
పలి లవలీలతాంగి నతిపట్టెను తాఁజిపదాబ్జపీఠికిన్.

మును పదియేడులాదిగఁ బ్రభుభ్రుకుటీవళినాట్యశాలయై
పొనుపడుమోమునన్ ముడుతపోయె నొకం, డధరమ్ముపైకిరా
నని శపథమ్ముపట్టు తొలిహాసము బోసిగవచ్చె, చామర
మ్మునుమఱపించు గడ్డమునఁబొందెను కేశమొకండు నైల్యమున్

శాంతములున్ మనోజ్ఞములు సంపదుదారములున్ మనోహర
స్వాంతనిదర్శనమ్ములు నచంచల భావలస త్కనీనికా
త్యంతవిశాలముల్ నిజమహత్త్వసమీక్షణతుష్టిరేఖకా
ప్రాంతములున్ దదంబకము లంతలుసేసి యతండు వాకొనెన్.



"మత్కళారూపగుణధర్మమహిమ మెఱుక
పఱచితివి విమర్శికవు దర్పణముపట్టి
నిన్ను గంటిని, తాజిఁ గంటిని, కుమారి !
ఇరువురను నాదు ప్రతిబింబ మేను గంటి.

సృష్టికర్తపనులు సృష్టి విమర్శించు
మీరు మద్విమర్శకారిణులటె
కూడి కూడఁబలుకుకొంటిరో నీవును
దాజి నాకు ధన్యతను ఘటింప."





# మహాప్రస్థానము

లలితవసంతశోభనవిలాస మెఱందల కింపఁ, బూవుఁదే
నెలఁ మిథునాళికిం గయిపు నింప, సమీరకుమార సౌరభ
మ్ములు పులకల్ ఘటించి జనముందనియింపఁగఁ గోకిలమ్మ జీ
వుల బ్రదుకాట పాడుకొనఁబో, దినరాజు వెలింగెఁ దేజుతో.

"అమ్మరో! నాక్షమావచనమంపుమ, రాఁడుగదమ్మ? నా ప్రియా
ణమ్మ్మ నతండు చూడఁడనినమ్ము; మమాయకుఁడాత్మఘాతదో
షమ్ములు పెక్కుసేసె, నవిసర్వము మత్ క్షమకయ్యె నర్హముల్
పొమ్మనవే! మదాశిషముఁబొందితి కొమ్మనవే శుభార్థముల్"

అని పరితృప్తి మోదము ముఖాబ్జమునం దొలఁకాఁడ దివ్యదృ
క్కును గయిసేసి వృద్ధపతి కూఁతునుజూచుచు, 'నీ కళేబర
మ్మునకిరవమ్మహాల్, సకియపొంత నెపూడ్చుమ, యాత్మతృప్తినీ
జననికి నాకు – రమ్మ! కడసారిగ నన్నటు త్రిప్పు తాజికై.

అని కుమారిసాయమంది తాజిని గాంచి
"ధన్యవైతి, నన్ను ధన్యఁజేయ
రావె రమ్యరోచి! రావె నా ముముతాజి!
పిలువఁగానె మాఱుపలికితఁటవె!

నిలునిలు వచ్చుచుంటి రమణీ! శ్రుతినించితి వెన్నినాళ్లకే
కలఁగినతంత్రులం దెలఁచి గాసెనగట్టిన బూజుదారువుల్
వెలలిచికొంచునయ్యో!యిటువెల్వలపోయెద వేజహాల్!ఖురాన్
నిలుపుమ, పిల్పువచ్చెఁ బయనింతునుతల్లి! వెలుంగుబాటలన్.

బలివెట్టితివి నాకె లలితజీవితలతాం
తనవాంశువులు మ్రొగ్గనాఁడె త్రుంచి
బోరగించితి నాకె పూరగించిన ప్రేమ
మధుపాత్ర నాతల్లి మఱపుదెచ్చి
ధారవోసితి నాకె త్యాగఫలమ్మీవు
తోడిబందిగఁ దోడియోడ పగిది
అర్పించితివి నాకహర్నిశల్ నిద్రావి
దూరశోణదృగంబుధారలెల్ల

ఏమికానుంటివో తల్లి! యింకమీఁద
దారిచూపిన నాకు నేదారిచూప
కరుగుచుండెఁ గృతఘ్నుఁడం చనవుగదవె!
—ఏమి! కంటను దడివెట్టెదేమి తల్లి!

ఎఱుకగలుగు నీవె యిటుబాష్పవాఃపూర
దృక్కుతో నరకము తెఱచియుంతె?
ఎంతయెఱుకయున్న నెడబాటు దుస్సహ,
మయిననేమి? సుఖమునందఁ జనుదు.

తీయనిన్రైదె మనోజ్ఞమయి తేమతోఁబంగని పూవుచెల్లియై
గీయనిచిత్రమై మెలపుకేలున నొత్తని మేలుబొమ్మయై
పోయనితేనెపోఁతయయి పొందులవిందయి యిందుమండలం
బేయగు నీహృదంతరము నిట్టులఁ గాఱియవెట్టుకోకుమా!

ఎంతచలువ తాకు! ఏమి యీ వలిగాలి!
ఎంతకాంతి తోఁచు నింతలోనె!
ఎంతయెఱుక పొడుచు! ఏమి లోవెల్గిది!
ఈ యతీంద్రియప్రవృత్తి యేమి!

"ఎంత దయాపయోధి వెలయించితివీశ్వర యీశ్వరా! కృపా
వంత, మనన్యదివ్యరసవంత, మమోఘహిమాంశుమండలీ
మంత, మఘాంధకారచయమండలవారకలోకనప్రభా
వంత,మదేమి! నీకు దయవచ్చెను నేటికయా దయామయా?"

అనుచుఁ గనులుమూసె నాస్థితప్రజ్ఞుండు
హర్షబాష్పసులలితాస్యుఁ డగుచు
పులకితార్ద్రదేహకలితుండు తానౌచు
అంత నిష్క్రమించె నతనివెలుఁగు.

వెలుఁగు తాజిలోని వెలుఁగుతోఁ గవకూడె
వెలుఁగు వెలుఁగు గలసి వెన్నెలందు
తాజి ముందు కొలఁకు తరఁగల నురుసుల
విహరణముల సలుపు విహసితములు.

సంపూర్ణము.



కవి పాదుషా



| గద్య కృతులు | పద్య కృతులు | నాటకములు |
|---|---|---|
| | శతపత్రము | |
| | గోవత్సము | |
| మధుకలశము | తాజమహాలు | ఢిల్లీదర్బారు |
| కథలు—గాథలు | దారా | దుర్గాదాసు |
| ఉత్తములు | పాలవెల్లి | శివరాత్రి |




చిరునామా

పువ్వాడ శేషగిరిరావు

భాస్కరపురం

బందరు